ఇది రజతోత్సవ ప్రచురణ

# వ్యష్టి

(కవితా సంకలనము)




సంపాదకత్వం

**డా॥ టి. శ్రీరంగస్వామి**

ఎం.ఏ., పిహెచ్.డి.,


**శ్రీలేఖ సాహితి**

సాహిత్య, సాంస్కృతిక సంస్థ

(స్థాపితం : 1977 రి.నెం. 2337/89)

ఇం.నెం.5-11-481, విద్యారణ్యపురి,

హనుమకొండ, వరంగల్లు - 506 009

***రజతోత్సవ ప్రచురణ 2001***

**VRUSHA** *(Collection of Free Verse)*
*Poetry Edited by* **Dr. T. SRIRANGA SWAMY**

**PUBLICATION No. 29**



**Price Rs. 30/-**



**'శ్రీలేఖ సాహితి' వారు ప్రచురించిన**
**ఉగాది కవితా సంకలనాలు**

1. ప్రభవ ................................ 1987
2. శుక్ల ................................ 1989
3. ప్రమోదూత ................................ 1990
4. ప్రజోత్పత్తి ................................ 1991
5. ఈశ్వర ................................ 1997
6. ప్రమాది ................................ 1999
7. విక్రమ ................................ 2000
8. వృష ................................ 2001



*For Copies :*

SRILEKHA SAHITHI
H.No. 5-11-481, Vidyaranyapuri
HANAMKONDA - 506 009 Warangal
Phone : 08712 - 448442

VISALAANDHRA PUBLISHING HOUSE, Hyderabad
and its BRANCHES

*Printed at*

SRI SHANTHI Offset Printers, Hanamkonda. Ph. 579541

# అనుభూతిని పంచుకునే వేళ ....

అనుభూతి ఎప్పుడూ అనుభవైకవేద్యమే. మీ అందరితో మా అనుభూతిని పంచుకునే ప్రయత్నమే ఈ నాలుగు అక్షరాలు. శ్రీలేఖ సాహితి 1977లో ఉద్భవించి ఈనాటికి రజతోత్సవ సంవత్సరములో అడుగుపెట్టింది. అంటే ఒక సంవత్సరం కాలము .......... ఒక సంస్థ మనుగడలో 25 సంవత్సరాల కాలము అంటే మామూలు అంశము కాదు. ఎన్నో ఒడిదుడుకులు, అడ్డంకులు ..................

ఒడిదుడుకుల నుండి, అడ్డంకుల నుండి ఎప్పటికప్పుడు చేయూతనిస్తూ, మా మార్గమును సుగమం చేస్తున్నవారు శ్రీలేఖ సాహితీపట్ల అభిమానమున్న సాహితీ మిత్రులే. వారి అండ లేకపోతే ఉగాదికల్లా సంకలనాలు రాకపోయేవి. అలాగే ఇతర పుస్తకాలు కూడా. ఆయా రచయితల సౌజన్యం, ప్రేమ, ఆశీస్సులు, వారి నమ్మకం శ్రీలేఖ సాహితికి పట్టుకొమ్మ అయినది. అందుకు మా కృతజ్ఞతలు పేరు పేరునా తెలుపుకుంటున్నాము. వారి చేయూత రక్షణాకవచంలా నిలిచింది.

"వృష" కవితా సంకలనము ఉగాదికే వెలువడాల్సింది కాని కొన్ని ఇబ్బందుల వలన ఆలస్యం అయినది. ఆలస్యం కూడా కొంత అమృతమే కదా !

మా సంకలనాలలోని కవితలను హిందీ భాషలోనికి అనువాదం చేసి, హిందీ సాహిత్య ప్రపంచానికి పరిచయం చేసిన శ్రీమతి శాంతాసుందరి గారికి మా కృతజ్ఞతలు.

ఈ సంకలనమునకు సహకరించిన సాహితీ మిత్రులు మా ప్రచురణలను అందించటంలో తమ చేయూతను అందిస్తున్న శ్రీ పచిక నరసింహారెడ్డి - శ్రీశాంతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, హన్మకొండ వారికి అభినందనలు.

ఎందరో మహానుభావులు ... అందరికీ వందనాలు.

సాహితీ సేవలో ...

**డా॥ టి. శ్రీరంగస్వామి**

అధ్యక్షుడు

శ్రీలేఖ సాహితి, వరంగల్లు.

# శ్రీలేఖ సాహితి ప్రచురణలు

1. శ్రీరామ శతకము - శ్రీ టి. రామానుజస్వామి రూ. 10.00
2. కవితా గానం - శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి రూ. 3.00
3. ద టు జెంటిల్ మెన్ ఆఫ్ వెరోనా - డా॥ జి. దామోదర్ (తెలుగు అనువాదం) రూ. 5.00
4. వేణుతరంగాలు - శ్రీ యల్. వేణుగోపాల్ రావు రూ. 5.00
5. ప్రభవ (కవితా సంకలనం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) ఒక సహృదయం
6. వరంగల్లు జిల్లా రచయితలవాఙ్మయజీవిత సూచిక - శ్రీ టి.శ్రీరంగస్వామి రూ. 15.00
7. కవితావనం - శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి రూ. 6.00
8. జన్మభూమి సిరులు - శ్రీ పల్లె సీను రూ. 6.00
9. జీవనరాగాలు - శ్రీ యల్. వేణుగోపాలరావు రూ. 10.00
10. శుక్ల (కవితా సంకలనం)- శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 5.00
11. ఎమ్మెస్సార్ కథలు - శ్రీ యం. సుబ్బారావు రూ. 9.00
12. ప్రమోదూత (కవితా సంకలనం) శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 6.00
13. నా మాట (శతకం) - శ్రీ యం. సుబ్బారావు రూ. 3.00
14. ఏకశిల వైతాళికులు(వ్యాస సంకలనం)-శ్రీటి.శ్రీరంగస్వామి(సంపాదకత్వం) రూ. 30.00
15. ప్రజోత్పత్తి (కవితాసంకలనం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 6.00
16. కోవెల సుప్రసన్నాచార్యులు వాఙ్మయ జీవిత సూచిక-శ్రీ టి. శ్రీరంగస్వామి రూ. 15.00
17. కావ్యం-కవిస్వామ్యం - డా॥ కోవెల సంపత్కుమారాచార్యులు రూ. 30.00
18. విశ్వనాథవారి కృష్ణ కావ్యాలు - డా॥ టి. శ్రీరంగస్వామి రూ. 60.00
19. నిరంతరం (కవితా సంపుటి) - డా॥ టి. శ్రీరంగస్వామి రూ. 10.00
20. మాధవ మాధుర్యం (కృష్ణతత్త్వ వీచిక) - శ్రీపల్లె సీను రూ. 26.00
21. ఈశ్వర (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 10.00
22. సాహితీ గవాక్షం (వ్యాససంపుటి) - డా॥ టి. శ్రీరంగస్వామి రూ. 30.00
23. సరయేవోనుండి ఏకశిలకు (అనుసృజన కవితలు) - డా॥ టి. శ్రీరంగస్వామి రూ. 30.00
24. రాగ పంక్తులు (కవితా సంపుటి) - శ్రీ పల్లె సీను రూ. 30.00
25. ప్రమాది (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 30.00
26. మనోరాగం (కవితా సంపుటి) - శ్రీ ఆర్. రంగస్వామి గౌడ్ రూ. 30.00
27. విక్రమ (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 30.00
28. అవధానవసంతం - డా॥ ఆశావాది ప్రకాశరావు రూ. 30.00
29. వృష (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 30.00

# ప్రపంచీకరణ

- డి. శ్రీధరాచార్య

"ఇజా"లన్నీ చచ్చిపోయి
"సెల్ఫిజం" పెరిగిపోయి
సంస్కరణల పేరుతో
వచ్చిందోయ్ వచ్చింది . .
ప్రపంచీకరణ
నాటి
భూస్వామ్య విధానం
జమిందారీ పద్ధతి
పెట్టుబడిదారీవ్యవస్థ
తిరిగి పురుడు పోసుకుంటున్నాయి
ప్రపంచీకరణ పేరుతో
పాలకులు, ఆరోగ్యం, విద్య, వైద్యం, ఉద్యోగం
నిరుపేదలకు
దండగమారివి అంటున్నారు
సబ్సిడీలు ప్రభుత్వానికి
భారంగా మారాయి
ప్రభుత్వ పెట్టుబడులు
పరిశ్రమల్లో తగ్గాయి
లేనివాడు
ఉన్నవాడి బానిస
ఊడిగం అతని జన్మహక్కు
కాదనే అధికారం లేనివాడికి లేదు
ఇది నేటి ప్రపంచీకరణ మంత్రం

లెక్చరర్, ప్రభుత్వ జూ॥ కళాశాల, ఆసిఫాబాద్, జి. ఆదిలాబాద్ - 504 293

# అందని ద్రాక్షలు

- యం.వి. ప్రసన్న

ఇజాల ముసుగులో నిజాలను కబళిస్తున్నారు
శాసనాల పేరుతో సామర్థ్యాన్ని చంపివేస్తున్నారు
ఆసనాల తోడుతో హక్కుల అణచి వేస్తున్నారు

చట్టాలను, తమ చుట్టాలుగ మారుస్తూ,
సంపదలను, సరదాలుగా దోస్తున్నారు

ఉపన్యాసాలతో ఊరిస్తూ ఉపవాసాలను పోషిస్తున్నారు

ఉద్యమాల ఊపిరినొక్కేస్తూ,
ఉద్యమకారులను ఉరికంబం ఎక్కిస్తున్నారు

తూటాలను వాటాలుగా పంచుకుంటున్నారు
ప్రాణాలను మాలలుగా మార్చివేస్తున్నారు

రాజ్యహింసకు ఎదురులేదు - రక్తతర్పణానికి విలువలేదు

సామాజిక న్యాయం కానరాదు - సామ్యవాదం రాదు ....... రాదు

ఉన్నవాడు ఉన్నవాడికే తోడు - పేదవాడికి దరిద్రుడే దేవుడు

మానవతకు విలువలేదు - మంచితనానికి స్థానం లేదు

దగాకోరుల రాజ్యంలో దరిద్రనారాయణులే దానకర్ణులు

ఆకలిచావుల రేవులో సంపన్నుల సందేశాల చిందులు

అన్నిరంగాలలో రంకుల రాట్నాలే
రాజకీయాలకు రాచబాటలు

నందనవనంలాంటి సుందర భారతంలో
అందని ద్రాక్షలు, అతి సామాన్యుల బ్రతుకులు

ఇ.నెం. 6-8-30, రాగన్న దర్వాజ, హన్మకొండ, వరంగల్లు - 506 011

# ఆకులు మొలిచే కాలం

- అనిశెట్టి రజిత

దహించే నిట్టూర్పులతో ఉసురుసురంటూ
ఎండుటాకుల కుప్పల్ని తొక్కుకుంటూ
యాతనగా గడిచిపోయింది ఆకురాలు కాలం
అహరహం చెమటలు కక్కుతూ
సెగసెగలుగా అనుభవించిన అవస్థను
ఇక నల్లమబ్బుల మోహరింపుల్లో
తొలకరి చిలకరింపులై ఊరడిస్తాయి.

ఆశలు అంకురిస్తున్నట్లుగా
తెప్పరిల్లిన రెక్కలతో పక్షులు విహంగిస్తున్నట్లు
పోతూ పోతూ ఉన్న ప్రాణం
వెనక్కి మరలి వస్తున్నట్లుగా
చివుళ్ళు పచ్చగా కళ్ళకు చూపునిస్తుంటాయి.

ఎంతటి శిశిరమైనా తిరిగిపోవాల్సిందే
మరచిపోయినవన్నీ మళ్ళీ జ్ఞప్తికి రావాల్సిందే
"అ, ఆ"ల నుండే అక్షరాల్ని దిద్దుకుంటున్నట్లు
ఒకటీ రెండూ అని లెక్కించడం నేర్చుకుంటున్నట్లు
బాల్యం నుండే జీవితాన్ని మళ్ళీ ప్రారంభిస్తున్నట్లు
ఆకులు మొలిచే కాలం
ఆయుష్షు పోస్తూ చల్లగా వ్యాపిస్తుంది
ఊపిర్లాడి పునర్జన్మించాంలే అనిపిస్తుంది.

ఇ.నెం. 3-12-60, కుమార్‌పల్లి, హన్మకొండ, - 506 001 ఫోన్: 08712-450493

# చెలిమి

- కుసుమ వెంకటరత్నం

చెలిమి మూడక్షరాలతో
ముడివడిన మమతల బలిమి
హృదయాంతరంగంలో ....
ఉద్భవించే తరంగాల కలిమి
ఏడడుగుల సహవాసంతో ఏర్పడే
విడువడని అనుబంధం - అమరం
అనురాగ అప్యాయతల వెల్లువ
ఆనంద సంకేతాల స్వాదం
చెలిమిలోని పలుకులు -
సేదతీర్చు సుధామధుర చినుకులు
చూపులలో - చెలగాటాల్లో -
చెరగని జీవిత చదరంగం
సంతోష సమాధానాల మిళితం -
దీర్ఘశాంత దయాళుత్వాల సమ్మేళనం
ఆశానిగ్రహ ఆవిర్భవ ఆవటం
పుష్పంలోని పరిమళాన్ని -
తేనిలోని తియ్యదనాన్ని -
అమృతంలోని మాధుర్యాన్ని
అందించేదే - చెలిమి !

ఇ.నెం.3-14-560, కొత్తూరు, హన్మకొండ, వరంగల్లు-506 001

# నేను వృషను

- రాధిక

(శ్రీమతి జి. కస్తూరీ ప్రసాద్)

నేను వృషను, వస్తున్నాను
రాలిపోతున్న మామిడి పూత దండతో
పాలిపోతున్న మనిషి అండతో

భూకంప బాధితుల కన్నీరు పన్నీరు జల్లుచుండగా
వేపచేదునే వేయింతలుగా చేసికొని
కారంరాసిన బియ్యపు అక్షింతలు వేసికొని

వసంతపు కుంటి పల్లకిలో
కోకిలమ్మ నోటి గరగర పాటచెవిలో

చెరకుగడలే చెర్నాకోలాలుకాగా
అరటిపళ్ల తొక్కలను తొక్కుతుండగా

కొత్త చింతపండు చింతగామారి
బెల్లం అల్లం కాదా మరి

అయినా నా కర్తవ్యంలో ఉండదు తేడా
నేను వృషనే కాదు నరుడా ...... చీకటిలో ఉషను కూడా.

ఇ.నెం. 70-3-33, విద్యానగర్, డాక్టర్స్ కాలనీ, రమణయ్యపేట, కాకినాడ.

# నాగరికులం

- అపరాజిత

అవి విషసర్పాలేఐనా
అవి మనల్నేమనవు
కోరలున్న జీవులే
కావాలని మాత్రం కాటేయవు
కాలుష్యాన్ని నింపవు
కటువుగా ప్రవర్తించవు
కోపమూ జాస్తీనే
మాటలు నేర్చిన మనకన్నా
మూగజీవులే నయం
మనకు నిలువెల్లా విషమే
మనలోని సంకుచితపు
స్వార్థ మనుగడల కోసం
సహచరున్ని మట్టుబెట్టు
దొంగ ప్రేమల నటన
ఏ మాత్రం తెలియదు వాటికి
నాగస్వరం ఊదుతుంటే
నాట్యం చేస్తాయి లయబద్ధంగా
నీతిమాలిన మనల రంజింప చేస్తూ
కాలువేస్తేనే కాటేస్తాయవి.
కాలుకదపకనే కాటేస్తాం మనం
కలికాలపు కుటిల నాగరికులం కదా ...... మరి

ఇ.నెం 1-306, రుక్మిణీ సదనము, చాణక్యపురి భీమారం, వరంగల్లు - 506 015

# దేవుడనుకో....

- మేడిచర్ల సూరిబాబు

పశువుల మేతకై
కొడవలి నిచ్చెను నాన్న
కవితా మేధకై
కలంను ఇచ్చెను అమ్మ
నాన్నను నీవు దేవుడనుకో
అమ్మను నీవు దేవతనుకో ...
మాగాణిలో నాగలి పట్టెను నాన్న
మా ఇంటిలో ఆకలి తీర్చెను అమ్మ
లక్షల కథలు చెప్పను నాన్న
అక్షరమాల నేర్పను అమ్మ
నాన్నను నీవు దేవుడనుకో
అమ్మను నీవు దేవతనుకో ...
పాలపిట్టను చూపెను నాన్న
పాలసీసా నోట పెట్టెను అమ్మ
పాపం పుణ్యం తెలిపెను నాన్న
పురాణాలనెన్నో చదివించెను అమ్మ
నాన్నను నీవు దేవుడనుకో
అమ్మను నీవు దేవతనుకో ...

ఇ.నెం. 7-88, రామరాజులంక, మం॥ మలికిపురం, తూ॥గో॥ జిల్లా - 533 253

# శ్రీ సరస్వతీ

- డా॥ ఆడెపు చంద్రమౌళి

శ్రీసరస్వతీ ! వాణి ! విశిష్టబోణి !
అమల కారుణ్య మూర్తి ! శ్రీ అజుని రాణి !
భాసురానంత సాగరభవ్య తరణి !
ధ్వని విధాయిని ! వాగ్దేవి ! వందనములు

నాద రూపిణి ! విమల వినోద రమణి !
వేదవేదాల కళ్యాణి ! వీణపాణి !
నిర్మల మనస్విని ! జనని ! నీలవేణి !
ధ్వని విధాయిని ! వాగ్దేవి ! వందనములు

అమ్మ సకల రాగాల గళమ్ము వీవు !
ఝుంమ్మను సుధా రస భ్రమరమ్ము వీవు !
కమ్మని పలు గ్రంధాల భాగ్యమ్ము వీవు !
ధ్వని విధాయిని ! వాగ్దేవి ! వందనములు

నీ వలన వ్యాస సుకవి పునీతుడాయె,
భక్త పోతన డద్వైత భాసుడాయె
'మొల్ల' అద్భుతమౌ కావ్యమూర్తియాయె
ధ్వని విధాయిని ! వాగ్దేవి ! వందనములు

సృష్టి కర్తకు సతివి ! సంక్షేమ సృతివి !
మహిని బోధనా శక్తివి ! మధుర సృతివి !
మా సుకృతివి, ధృతివి, దివ్య మతివి గతివి !
ధ్వని విధాయిని ! వాగ్దేవి ! వందనములు

భారతీ ! శుభవీక్షణీ ! పద సవిత్రి !
పసిడి చాయల సుందర మిసిమి గాత్రి !
పావనీ నిన్ తలచెదము పగలు రాత్రి
ధ్వని విధాయిని ! వాగ్దేవి ! వందనములు

రంగశాయిపేట, వరంగల్లు - 5

# WWW. ఇండియా డాట్ కాం

- అన్నవరం దేవేందర్

నన్ను నేను పొలిమేరల్లో పారేసుకొని
నా తలకాయ జేబులో నిక్షిప్తం చేసుకున్నాను
ఓరి దేవయా ! నువ్ అమెరికాకు పోకురా అని
మా తాత ఎంత కసిరిచ్చినా
గుండెను కుదువపెట్టి - సైబర్ లైఫ్‌ను కలలుగన్నాను
ఇక్కడంతా ఫైబర్ నవ్వులు - డాలర్ పువ్వులు
మేం హృదయాలతో ఉదయించం
ప్రేమలేకున్నా కంప్యూటర్‌కు ప్రాణం ఉన్నట్లే
మా ఆత్మలన్నీ మూటగట్టి
అటుకు మీద దాచిపెట్టిన వాల్లం కదా
అంతా 'ఈమెయిల్' డాట్‌కామ్‌ల దర్వాలే
పిట్స్‌బర్గ్‌లో మా బాపమ్మ యాదికస్తే
కుమ్మరి కనకమ్మ@యాహూ .... డాట్ .... కాం అంటా
తెరమీదికి మా ముసలమ్మ వచ్చి
నేను కన్నుమూసినంక నన్ను సాగనంపక పోతివా
దేవిగా అంటూ
బ్రౌజింగ్ చేస్తున్న నన్ను పొడుస్తుంది
'పాలగోకు' తింటావా పిలగా అంటూ
కశ్కెతో నోట్లో పెట్టినట్లే కన్పిస్తుంది
పీరీల పండుక్కు మలీల ముద్దలు
తినిపించినట్లే తెరపై కదలాడుతుంది
కాని ఏంచేయను మా బాపమ్మ పోయింది
నేను ఇండియాకు వెళ్లలేదు

అంకుల్ శామ్ నన్ను పంపించలేదు
నక్కా నాగలోకం లెక్క
ఎక్కడి 'పోతారం' ఎక్కడి 'పిట్స్‌బర్గ్'
మా లెక్కలన్నీ డాలర్లు డాలర్లు డాలర్లే కదా
నన్ను కన్న నా పల్లె రొంబెచ్చె గుద్దుకొని రోదిస్తుంది
మా తాత వాడిన కుమ్మరిసారె విరిగిపోయింది
ఇవేవి నా కంప్యూటర్ తెరపై కన్పించవు
నా చుట్టూ ఏ.సి. కార్లు ఇంటర్నెట్ తెరలు ఇన్ఫర్‌మేషన్ విప్లవాలు
పరిభ్రమిస్తున్నాయి
ఇన్ని ఉన్నా నా తాత గుర్తకస్తే
చెదిరిపోయేందుకు నాకు మనస్సు లేదు
కుమ్మరి మల్లయ్య @యాహూ .... డాట్ .... కాం అంటే
చల్లని వెన్నెలతో గడెంచపై కూర్చొని
శాత్రాలు చెప్పతున్న తాత కండ్లల్ల మెరుస్తున్నడు
ప్రాణం అవిశిసోతుంది
నేను అమెరికాకు ఎగిరిరాంగా
తాత ఎక్కెక్కిపడి ఏడ్చిండు
ఇక్కడ ఏడుస్తామంటే కన్నీరే లేదు
ఆత్మీయత అక్కడే వదిలేసాను
ఇంత ఆలోచన నాకెందుకు
నాకు డాలర్లు కావాలి డాలర్లు
కన్నవారు వద్దూ అమెరికానే హద్దు.

17-4/5, ఆనందభవన్, టీచర్స్ కాలనీ, హుస్నాబాద్, కరీంనగర్ - 505 467ఫోన్: 08721-55433

# దృశ్యం

- డా॥ కాసర్ల రంగారావు

మానవ జీవిత కోలాహలం
భీభత్సజనిత హాలాహలం

శాస్త్ర సాంకేతికాలు పరిఢవిల్లిన పుడమి
బీడులై మోడులైన అందించునా కలిమి

శ్రమసంస్కృతిని మరుస్తున్న జాతి
చేరువవుతోంది బానిసత్వపు అధోగతి
పాలనా నిర్వాహకాల పరిస్థితి
అప్పుల ఊబిలో కూరుకుపోయిన దుర్గతి

మాయాజూదపు లాఘవంలో మొహం వేళ్లాడేసుకున్న ధర్మరాజులు
స్టాక్ మార్కెట్ చాపచుట్టగ దళారీ దగుల్బాజీలు
శకుని మామల పాచికల యోచనలు
చర్య తీసుకుంటాం తప్పదంటున్నారు దుర్యోధనాధులు

పట్టు పడితే జేబుదొంగ
చితకతన్నులు గౌరవంగ
హర్షద్, పారీఖ్‌లెందరో
బాటజూపిరి దర్పమలరగ డాబుసరిగ

కూలిపోయెను కలలసౌధం
కరిగిపోయెను కాలమేఘం
సాగనున్నదా . . సర్పయాగం ?
వెలుగునింపున గుడ్డి దీపం !

విషము చిందిన వైపరీత్యం !
వంత పాడెను మృత్యుగీతం !
వెతలు తీరుట ముక్తిమార్గం !
చేవ చూపున .. గాండీవం ?

బి.ఇ. 18, ఐ.యం. కాలనీ, కె.టి.పి.యస్., పాల్వంచ - 507 115

# నేను

- దాస్యం లక్ష్మయ్య

అవినీతికి హారతులిస్తూ
జన సౌఖ్యం భోజ్యం చేస్తూ
మదంతోడ మొలిగే జీవుల
అనవరతం భరతంపడతా

మానవతుల శీలం దోస్తూ
నిండు బ్రతుకులెన్నో కూల్చే
రాబందుల రాక్షసకృత్యపు
తలరాతలు మార్చేస్తానోయ్
తలబిరుసులు దించేస్తానోయ్

రోడ్డుప్రక్క దీనుల గాథలు
గోడుమనే జీవుల ప్రాణం
అనుక్షణం సంరక్షిస్తా
తిమిరంతో సమరం చేస్తా

ధర్మాన్ని నీతిని నాతిని
పెరికి విరిచి నలిపేవాళ్లను
సమూలంగ ఖననం చేస్తా
ఐక్యంగా సమాధికడ్తా

మానవత్వమన్నది మరచి
నేరాల్లో విహరించేస్తూ
అపకారం చేసేవాళ్లకు
కారాన్ని రుచి చూపిస్తా
'శ్రీ'ముఖం చుట్టేయిస్తా
కలం పట్టి కదిలొస్తున్నా ........
గళం విప్పి వినిపిస్తున్నా ........
జనం నుండి నడిచొస్తున్నా ........

ఇ.నెం. 11-73/2, హన్మకొండ రోడ్, హుస్నాబాద్ - 505 467

# ఆమని కోరిక

- గుళ్ళపల్లి తిరుమల కాంతికృష్ణ

ఎన్నెన్నో ఆశలను ఎదలోన నింపుకుని
ఎపుడెపుడెపుడొస్తావని ఎదురుచూస్తు ఉన్నాము

ఓ ఉగాది పర్వదినమా ! స్వాగతం ......
నా జీవన పరిమళమా ! స్వాగతం ......

ఏ యేటికి ఆ యేడు - ఏదో ఒక పేరు మార్చి
అరువది పేర్లతో నీవు - ఆటలాడుతుంటావు
నీ పేరులో మార్పెగాని - నీ తీరులో లేదు మార్పు
స్వాగతమ్ముగొనుటెగాని - స్వాంతన కూర్చుట లేదు

ప్రతి యేడు పదిలముగా - పలురకముల విన్నపముల
పనిగట్టుక వినిపించిన - పరిస్థితిలో మార్పే లేదు
షడ్రుచులలో చేదునొకటి - శేషముగా మాకు ఉంచి
మిగిలిన అయిదింటి నీవు - హాయిగ హరియిస్తుంటివి

బీదబిక్కి జనము మదిని - ఖేదము తొలగించమనగ
మోదమునే తొలగించి - వేదన మిగులుస్తుంటివి
స్వాముల ఘనతలు లేని - స్వాముల మాకిమ్మనగ
స్వాముల పుట్టల దాగెడు - పాముల మాకిస్తుంటివి

పాడిపంట పెంచి మమ్ము - సల్లంగా సూడమనగా
పరేషాన్లనే పెంచి - తమాషాలు సూస్తుంటివి
చౌకగ వస్తువులనిచ్చి - సామాన్యుని సాకుమనగ
ఆకాశపు చుక్కలనే - అందుకొమ్మనంటుంటివి

ఈ యేడైనా నీవు - తొలకరి చినుకుల గురిసి
ఎండిన మా గుండెలలో - పండించుము చిరునగవులు

ఇ.నెం. 16-16, చేర్యాల, జి॥ వరంగల్లు - 506 223

# టైం విలువ

- షేక్ జిలాని బాష

టైం వేస్ట్ చేయకు టైంతో ఆడి
టెన్షన్‌తో ఉండకు టైం దగ్గర పడి
అటెన్షన్ టెన్‌షన్‌తోనే నేర్చుకో
టైంలోనే జీవితం తీర్చిదిద్దుకో

ఎలోన్‌గా ఉండి టైం థింక్ చేయకు,
A-1గా ఉండి టైం థ్రిల్ చేయి
ఏకాగ్రతలోనే ఉంది టైం విలువ
ఎనాలసిస్ చేస్తే తెలుస్తుంది టైం ఘడియ.

ఊహలలోనే కాలం గడపకు
ఓడిపోయాను కాలంతో ఎప్పుడూ చెప్పకు,
సాధించాలి జీవితాన్ని కాలంతో కలసి
విజయ చక్రాన్ని త్రిప్పాలి కాలంతో మసలి

సహార ఇండియా, జె.పి.యన్. రోడ్, వరంగల్లు - 506 002

# ఎగిరిపోవాలని ఉంది

- హాసీ

జరజరా
కొండనెగబ్రాకి
పక్షినై
రెక్కలు విదుల్చుకొని
తటాలున దూకి
భూమి ముద్దాడి
కెరటమై
నింగికెగిసి
నీలివర్ణమై మెరిసి
మేఘమై వర్షించి
జలజలారాలి
నదీనదమ్మై పారి
ఆకులో, అడవిలో మాయమై
అవనియంతా నేనై
భూమిన్నాచేతుల్లోకి తీస్కొని
ముద్దిడి
ఎంచక్కా ఎగిరి
కానరాని
విశ్వాంతరాళమ్ములోకి
కిరణమై
శతకోటి సూర్యుల కాంతిపుంజమ్మై
ఎగిరిపోవాలని ఉంది
ఎగిసి దూకాలని ఉంది

ఈగ హనుమాన్. Q No. E-54, B-కాలనీ, KTPS., న్యూ పాల్వంచ - 507 115 జి॥ ఖమ్మం

# భాషకందని భావం

- నామిని సృజనాదేవి

నీలినీడల గాజుకళ్లతో, క్షణక్షణం భయాందోళనలతో
క్షతగాత్రులతో, వికలాంగులతో రణభూమిని తలపింపజేసి
మరుభూమిగా మారి ప్రకృతి కర్కశ కరాళనృత్యానికి
మారణహోమానికి, మృత్యుహేళకు సాక్షీభూతాలుగా
శకలాలయిన శిథిలాల్లో, కన్నీరింకిన కళ్లతో
అనుభూతులు ఏరుకుంటున్న జీవచ్ఛవాలు
సమాజంలో పేరుకుపోతున్న నాగరికతకు
అడుగంటుతున్న మానవత్వానికి ప్రతీకగా
కుళ్ళుతున్న శవాల గుట్టలు
అవకాశాన్ని వదులుకోలేని రాజకీయనాయకుల్లా
శవాల్ని చూసి వాలుతున్న రాబందులు
కానరాని సుదూర తీరాలకెళ్లిన కన్నవారిని తలుచుకుంటూ
వారి జ్ఞాపకాలు వెదుక్కుంటు సాకారమైన స్వప్నంగా
భగవంతుని లీలలో భాగంగా విధివిలాసంలోని అంశంగా
పదిరోజుల తర్వాత ప్రాణాలతో బయటపడ్డ జీవాలు
భూమాత హుంకారానికి మౌనసాక్ష్యంగా మిగిలిన మూగజీవాలు
ఇది ...... గుర్తుపట్టలేని గుండెలవిసిన గుజరాత్.
భాషకందని భావంతో భరతమాత
చెలియలికట్ట దాటిన కన్నీళ్లతో నేను.

ఇ.నెం. 11-29-36, పృథ్వీనగర్ కాలనీ, 2వ బ్యాంక్ కాలనీ, వరంగల్లు - 506 002

# వృష - ఉగాదీ ఆహ్వానం !

- పల్లె సీను

వెలుగుల ఉషోదయానికీ -
తెలుగు జన మహోదయానికీ,
ప్రత్యేక ప్రతిరూపంలా-నిత్యైక కళ్యాణవైభవంలా
కదలివచ్చే వసంతలక్ష్మీస్వరూపిణీ !
వృష ఉగాదీ ! ఆహ్వానం !
తూరుపు దిశ-ఉజ్వల తేజమై
తుషార జీవన సంప్రోక్షమై-వినూత్న భావాంకుర సంప్రీత్యమై
వినిర్మల పులకాంకుర పదభాష్యమై వెంటరాగా ...
చైత్రరథారూఢవై-చైతన్య స్వరూపిణివై-
తరలివస్తున్న-వృష ఉగాదీ ! ఆహ్వానం !
అమ్మా వృషా !
ఉదయించే సూర్యబింబం !
గతినిమార్చే భూగోళం-పెద్దవైతే,
ప్రకృతిని శోభించే వసంతం !
శృతిని సవరించే కోకిలగానం చిన్న చిన్నవైనా
అన్నీ నీ స్థితికి, మార్గదర్శకాలే-అత్యంత సుందర కళారూపాలే-
అనిపించుకుంటాయి-అనుగమిస్తూ ఉంటాయి
మరి ! నీ మార్గదర్శకం-నీ సుందర కళారూపం !
కేవలం-వృద్ధ పరిష్వంగం-కాకూడదు
స్వప్న శృంగారం-అంతకన్నా కూడదు
ఎందుకంటే-గడిచినకాలం తిరిగిరాదంటారు
ఇది నిట్టూర్పు నిశ్వాసాల భారంతో అనే మాట
కానీ ! ఇప్పుడు గడిచిన కాలం రాకూడదనీ
భయకంపితులవుతున్నాం-
మొన్నటి "ప్రమాది" ఉన్మాదియై-
ప్రమాదంలో దించింది-ఒరిస్సాను కన్నీళ్లలో ముంచింది
నిన్నటి "విక్రమ" కృద్ధమై-
వక్రపరాక్రమం చూపించింది-గుజరాతు భూగర్భాన్ని చీల్చింది
నేటి "వృష" ! కృషివృషభమై-ఫలప్రదాతయై,
పరమార్థం పంచియిస్తుందనీ ఆశించి ఆహ్వానిస్తున్నాం !

అన్నీ అర్థం చేసుకున్నదనే-ఆలోచనలో ఉండిపోతున్నాం !

వెళుతూ వెళుతూ పాపం వృషకి ! ప్రమాదీ విక్రమ-లేం చెప్పారో కాని !

పెద్దక్క తుఫాను (ప్రమాదం) తలచుకుని వణికిందనీ,

చిన్నక్క ఛిద్రస్వరూపం చూసి దద్దరిల్లిందనీ,

మళ్ళీ జనాల్ని చూసి జడుసుకోకనీ,

భూతవైద్యం చేయించుకోమని-బుద్ధిగా మసలుకోమని

చెప్పి వెళ్ళి వుంటారు-

ఓదార్చి-కళ్ళు తుడిచారా ? జబ్బ చరిచి బుజ్జగించారా !

ఈ జనమంతా వింత వాహిని సుమా !

అమ్మా ! అని గౌరవిస్తారు

వెఱ్ఱి భ్రమతో-చెంగలిస్తారు

కుఱ్ఱ చేష్టల్తో-అంగలారుస్తారు

ఆకాశాన్ని-చుంబిస్తారు

భూదేవిని-తొక్కేస్తారు

మాకుగాక-మరెవ్వరికీ వండివార్చడం వద్దంటారు

అన్నీ మానవనైజాలు-కొన్ని కాలాలు భరిస్తాయి

కొన్ని వేళలు స్మరిస్తాయి

ప్రతి ఉగాదిలా ! వృషా ! అందరిలా నీక్కూడా !

మా హృదయ పీఠం వేసి వుందమ్మా !

అభిమానించి, కూర్చొని సేదదీరు

కాలధర్మం తెలుసుకో-కష్టసుఖం చూసుకో !

ప్రతి ఋతువునూ భద్రంగా పొదివిపట్టుకొని

ఆరు కాలాలూ-మూడుపూటలూ

కరుణార్ద్రంగా-కనిపిస్తే చాలు

కడుపునిండా-తినిపిస్తే చాలు

*రిటైర్డ్ లెక్చరర్*, 2-1-14, సరస్వతీ నగర్, గోపాల్‌పురం రోడ్, హన్మకొండ.

# మానసమా !

- పి.వి. శ్రీరమ

విహరిస్తావు విహంగాలతో
ఆకాశాన అంచెలంచెలుగానున్న తారల వెంట
తారాడుతావు పోరాడుతావు
తళుకు తళుకునా మెరసిపోతానంటావు
చక్కని చంద్రుని చలువను పంచుకుంటావు
పైకెగసి ఘనాఘనాలలో నుంచీ ఘనీభవిస్తావు
స్పర్శిస్తా ! వర్షిస్తా ! హర్షిస్తానంటావు
నింగీనేల అంతా నాదే, దిక్కులన్నీ ఒక్కటి చేస్తానని
తిరుగాడుతావు పిరుగిడుతావు
క్షణంలో స్వర్గలోకం చూచి వస్తావు - నాకలోక సుఖాలకూ
భ్రమించీ, తమించీ, రమించీ వ్రాలిపోతావు - తేలిపోతావు
నీ గమనవేగం, బస్సుకుగానీ, రైలుకుగానీ, విమానమునకుగానీ లేదు
ఇంతెందుకు ? నీ వేగం వాయువునకు కూడా లేదు
ఎండ, వాన, చలి నీకు తగలవు - అగ్ని నిన్ను అంటదు
ఉరుములు, మెరుపులు, పిడుగులు నిన్నాపవు
మంత్రివౌతావు, రాజువౌతావు, చక్రవర్తివౌతావు
సర్వస్వంను శాసిస్తానంటావు - పోషిస్తానంటావు
ఎన్ని ఆశలో ! ఎన్ని ఊసులో !
ఎన్ని హంగులో ! ఎన్ని పొంగులో !
కనిపెడతావు కన్నులతో ప్రమేయం లేకుండానే.

---

ఇ.నెం. 2-7-1241, విజయపాల్ కాలనీ, హన్మకొండ, వరంగల్లు.

# మాటా - మౌనం

- వరిగొండ సత్యసురేఖ

మౌనం తపస్సు అవుతుంది
మౌనం విపత్తు తెస్తుంది
మౌనం ముక్తికి మార్గమవుతుంది
మౌనం భయానికి చిహ్నమవుతుంది
నెలవును తప్పిన ఏ పదమైనా
విలువను కోల్పోతుంది
ముక్తికి మౌనం, భక్తికి మాట
దండించాల్సిన మాటే గొప్పది
అనిర్వచనీయ మౌనంకన్నా,
మూర్ఖుని యెదుట మౌనం గొప్పది
పాండిత్యపు మాటల ప్రదర్శనకన్నా,
మంచిని పెంచే మాటలు గొప్పవి.
తపస్సు పొందిన మౌనంకన్నా
గ్రహాల కక్ష్యలు మాటా-మౌనం
ఏది తప్పినా ప్రమాదమే !

ఇ.నెం. 5-70, జీవనమిత్రనగర్, విద్యారణ్యపురి, హన్మకొండ, వరంగల్లు - 506 009

# మేరా దేశ్ మహాన్

- రంగు చక్రపాణి

దేశనాయకులంతా తెహల్కా టేపుల వ్యవహారంలో
కొట్టుమిట్టాడుతుండగా
జాతి వేగులు నిద్రపోతుండగా
కార్గిల్‌లాంటి మరో విపత్తు
భారత-బంగ్లాదేశ్ సరిహద్దుల్లో రానే వచ్చి పడింది
అగ్నిపర్వత లావాజలంకన్నా తీవ్రమైన వేడినీళ్లను
మన వీర జవాన్లపై కుమ్మరించారు !
ముగ్గురి చేతులని చేధించారు, ఇద్దరి కాళ్ళు నరికేశారు
పదునైన కత్తులతో పెట్టారు గాట్లు ఒంటినిండా తూట్లు పడేలా !
సూటిగా కండ్లలోకి తుపాకులతో పేల్చారు
ఇవి చాలవన్నట్టు ఒక జవాను శిరస్సునే ఏకంగా ఖండించారు !?
ఇంత ఘాతుకం జరిగేదాక దేశనాయకులు పనికిమాలిన
నిశ్శబ్దం నటించి, అంతా అయాక కేవలం ఆదర్శం
ప్రకటిస్తే ఏమి లాభం ?
సరిహద్దుల వివాదాలు మన దేశాల దౌత్య సంబంధాలు
హద్దులలోనే యుండగానే పరిష్కరించబడితే
ఉభయదేశాలకు కల్గించును శుభాలు !
మన భారతదేశం శాంతికాముక దేశమే !
స్వీయరక్షణకై అణుబాంబును తయారు చేసుకొన్న దేశమే !!
మరి చిట్టెలుకలు, ఏనుగులను ఛాలెంజ్ చేస్తే ఎలా ?
మన సరిహద్దులను పొరుగుదేశాలు కలలోనైనా
కబళించ సాహసించకుండా యుంటేనే
"మేరా దేశ్ మహాన్" అనుపించుకోదు ?
సదా దేశపాలకుల, వేగుల, వీరజవానుల, ప్రజల
అప్రమత్తతే జాతికి శ్రీరామరక్ష !

హనుమకొండ, వరంగల్లు - 506 001

# దేవుడు

- వరిగొండ కాంతారావు

కాల్రెక్కలు యాష్టకస్తే
కడుపు కాకలైతది
కడుపు కాకలైతే
నోటికి తినబెడ్తరు
నోరు తినేదానికి
కండ్లు ముక్కు మెచ్చాలే

గుండెకు పోటస్తది
చెముటలు ముకానికస్తయి
మెదడుకు వాతమస్తది
కాళ్లేతులు పడిపోతయి
కడుపులనొస్తది
కండ్లేడుస్తయి
నెత్తికికోపమస్తది
కాల్రెక్కలు తన్నుకుంటయి

దేవుని పని ఒక్కటి సక్కగ లేదు
నంబరు మీదికి దీసుకుందామని
మతలబుజేస్తె కలుస్తలేదు
అయితాయే యాడికిబోతడు
కలువకపోతడా-అడుగకపోతనా

ఇ.నెం. 5-70, జీవనమిత్రానగర్, విద్యారణ్యపురి, హన్మకొండ, వరంగల్లు - 506 009

# రహస్యం

- భండారి

జీవితమంటే కేవలం
ఓ చలనం
అస్తిత్వమన్నది కేవలం
ఓ భ్రమ
అయినా ........
జీవితకాలమంతా
అస్తిత్వపు అన్వేషణలోనే
సత్తు-అసత్తుల మధ్య
అస్తిత్వం పునరావృతమవుతూ
జీవితగమనంలో
రాబోయే తరాలకు
అందించే యోచన రహస్యం అవుతుంది

*(శ్రీవాస్తవ కవితకు అనుసృజన)*

Qr. No. 333, C.I.D కాలనీ, కాచిగూడ, హైదరాబాదు 500 027

# రంగుల ప్రపంచం

- ఎమ్మెస్సార్

హైటెక్కు ప్రపంచం
అదో రంగుల ప్రపంచం
అదో మాయాబజార్
అక్కడ ..
విద్య వ్యాపారమవుతుంది
వైద్యం అంగట్లో వస్తువవుతుంది
బంధాలు సెంటిమెంట్లవుతాయి
అమ్మ - అద్దెకు దొరకుతుంది
నాన్నకు - చిరునామా అవసరం లేదు
"క్రమశిక్షణ మా ప్రత్యేకం" అన్న నినాదం
"కంప్యూటర్ మా లక్ష్యం"గా మారుతుంది
జాతీయగీతం అమెరికాలాపన చేస్తుంది
దేశాన్ని అమ్మేవారు, దేశభక్తులవుతారు
పొలాలు శ్మశానాలవుతాయి
విద్యాలయాలు ఉరికొయ్యలవుతాయి
కార్మికులు గోరిల్లో శవాలనుత్పత్తి చేస్తారు
అక్కడ .....
అన్నం, నీళ్ళు దొరకవ్
సెల్ ఫోన్లు - కలర్ టీవీలు
కారు చౌకగా లభిస్తాయి
ప్రేమ అమ్మబడుతుంది తూకానికి
రక్తం చిమ్మబడుతుంది ఉత్త పుణ్యానికి
అదో మాయాబజార్
అదో రంగుల ప్రపంచం

మండవ సుబ్బారావు, వివేక వర్ధని కాలేజి, లక్ష్మీదేవిపల్లె, కొత్తగూడెం. ఫోన్: 47886

# ఎగరాలి ఎగరాలి జాతీయ జండా

- ఇ. అయిలయ్య

పల్లవి : ఎగరాలి ఎగరాలి జాతీయ జండా
చిరకాలముండాలి మన జాతికండా ॥ఎగరాలి॥

చరణం : మువ్వన్నెల జండా
ముచ్చటైన జండా
భిన్నత్వంలో ఏకతను
బోధించే మన జండా ॥ఎగరాలి॥

2) సస్యశ్యామలం శాంతికి
సాహసానికిది జండా
శాంతి అహింసలకండా
సర్వజగత్తులో ముందుండా ॥ఎగరాలి॥

3) అమరవీరులను జ్ఞప్తికి తెచ్చే
ఆశాజ్యోతుల జండా
ఇది ఆశాజ్యోతుల జండా
ఇది అభాగ్య జీవులకండా ॥ఎగరాలి॥

4) భ(భా)రత జాతిని ఏకంజేసే జండా
భావితరాలకు బాధ్యత నేర్పే జండా
సామరస్యము సౌభ్రాతృత్వము
సూచించే ఈ సుందర జండా ॥ఎగరాలి॥

ఇది మన అందరి జండా
ఇది మన అందరికండా ......

గ్రా॥ మర్రిముచ్చాల, మం॥ చేర్యాల, జి॥ వరంగల్లు

# ఆవేదన

- కిశోర్

నీటి కోసం నింగివంకా
పంట కోసం నేలవంకా
ఆశపడుతూ పరుగుపెడుతూ
నేలతల్లిని నమ్ముకుంటూ
ఉన్నదంతా అమ్ముకుంటూ
నా బిడ్డకన్నా ప్రాణమంటూ
చేల మధ్యన తిరుగువాణ్ణి
బక్కచిక్కిన బడుగువాణ్ణి
కర్మ లోకపు కర్షకున్ని !
నాసిరకం విత్తనాలు - వెన్నెముకను విరిచేస్తే
కల్తీ మందులన్ని - ఆ పంటను మేసేస్తే
ఆ మాత్రపు పంటనింక - అరువిచ్చిన షావుకారి
ఆసాంతం మేసేస్తే
మీ ఆకలి తీరుస్తూ - ఆకలితో చస్తున్నవాణ్ణి
అన్యాయపు ఉరికొయ్యకు
అవినీతే ఉరితాడై
నా ప్రాణం తీస్తుంటే
భూములన్ని మరుభూములై
క్షుద్రశక్తుల విలయతాండవం
ఆరంభంకాక ముందే
మేలుకుంటే మంచిదంటూ
ఏలికలకు తెలుపుతుంటి.

N.V.N. చారి, ఇ.నెం. 2-11-387, విద్యారణ్యపురి, హన్మకొండ - 506 009 వరంగల్లు

# స్త్రీ ఔన్నత్యం

- మంథెన అండాళ్

ఉ. స్త్రీయన నెవ్వరింక కన శ్రీలకు మూలమునైన మూర్తియే
పాయని భేద భావముల వర్తిల బోకుడు ! సృష్టి యందునన్
న్యాయము నెంచగా 'ప్రకృతి' నాణ్యత యింతని తెల్పనేర్తుమే !
స్థాయిని గుర్తెరుంగుటయె సంస్తవనీయము యేరికేనియున్.

సీ. సరితూచగాలేని 'జనని' స్థానము స్త్రీది। ప్రథమ దేవతగాగ బ్రస్తుతింప
"మాతృదేవోభవ" మంజులనాదంబు। వేదఘోషితమయి వెలయుగాదె
తల్లిగా భువికల్పవల్లిగా జనయిత్రి। కన్న సంతును సాకి క్రమముగాను
రాజుగానో, కవిరాజుగానో లేక। భోగిగానో, మహాయోగిగానొ
ఏ మహాత్ముండైన నీ ధర తల్లిచే। దిద్దితీర్చగబడు స్థిరముగాను

తే.గీ. ఉగ్గుపాలతో నేర్పెడుయుచిత బోధ। జీవితము ప్రభావంతము చేయుగాదె
తల్లి తనువులో తనువిచ్చి దయనుపెంచి। సార్థకము చేయు బ్రతుకులు సమరసముగ.

ఉ. మానవసేవయే ధరను మాధవసేవ యటంచు నెంచియున్
మానిని జాతికెంతయును మన్నిక మీరగ జేసి సేవలన్
దీనుల దిక్కుగాగ మరి దేవతగాగ "మథర్ థెరీస, యే
స్థానమునైన పొందగల సత్వము నాతికి నున్న దెంచగన్

సీ. సంధింపదే నాడు శరముల రణమందు। నరకునిపై 'సత్య' గరిమ బూని
ఎదిరించదే నాడు యెదిరి కంపముజెంద। ననియందు 'మాంచాల' యగణితముగ
ఓడించదే నాడునొనర 'రుద్రమదేవి'। సంగరమందున శాత్రవులను
అణచదే నాడు రాజ్యాధికారముబూని। 'ఝాన్సీ'యరాతుల జన్నమందు

తే.గీ. వీరవనితలై భువిలోన ధీరవనిత। లనగ ఖ్యాతిగడించినారతివలయ్యి
స్త్రీల కాదర్శమూర్తులై చెలగలేదె। అబలలా ! కాదు సబలలేయనగనాడు

ఆ.వె. పడతి సహనమూర్తి పరికింప త్యాగాల। రాశి, ధైర్యశాలి రాజితముగ
మేలుకొనగవలయు, మేలుగాంచుటకునై। సంఘ దురలవాట్లు సాగనీక

ఇ.నెం. 1-56, గాంధీనగర్ వీధి, నర్సంపేట - 506 132 జి॥ వరంగల్లు

# శాంతి

- జి. దేజి

అణువు నుండి అఖండ విశ్వం వరకు ఆలోచించాను
ఆకార-పరిమాణం తప్ప ప్రాణమే లేని పదార్థం
గాలి-ధూళి తప్ప, మెదడే లేని మోడు,
పర్వతాలు-లోయలే తప్ప, గుండేలేని గుండురాళ్ళు
అయితేనేం ? గైడే లేకున్నా .......
గమన నియమాలు వీడలేదు 'గ్రహాలు'
ఉనికి ఉందన్న ఆధారం తప్ప, అగుపించని అబ్బురమది,
ఋణావేశమున్న ఋజువేతప్ప, ఆలోచనలేని వేశమది,
ద్రవ్యం ఉన్న మాటే తప్ప, దాని విలువ శూన్యానికి దరి
అయితేనేం ? ఎవరి అవసరాలే లేకున్నా-
క్రమభ్రమణంలోనే సాగుతున్నాయి 'ఎలక్ట్రాన్లు'
కాని !
సృష్టికి ప్రతి సృష్టి చేయగల 'సూక్ష్మగ్రాహి'
మంచి-చెడు, విశ్లేషించగల 'వివేకి'
ద్రవ్యమేకాక ద్రవించే 'సహృదయి'
జీవులన్నిట అత్యున్నత స్థానంలో నిలిచి,
బ్రతుకు బాట నియమాల్ని మరిచాడు 'మానవుడు'
అంతే !
అందుకే అశాంతి, అశాంతి, అశాంతి,
ఈ విశ్వ రహస్యం తెలుసుకో !
విశ్వంలో 'శాంతి' నెలకొల్పు.

ఇ.నెం. 6-1-51, సెంట్ పాల్స్ స్కూల్ దగ్గర, హన్మకొండ, వరంగల్లు - 506 001

# సృష్టి చిత్రం

- పల్లె రవివంశీమోహన్

హృదయ ఖజానా ధృవం వద్ద
    జ్ఞానోదయ రేఖాంశాలు ఊగిసలాడుతున్నాయి
ఉదయం సూర్యుడికి లేఖరాసిందట "ఉదయించమని"
పచ్చని పుడమి కబురంపిందంట మేఘాన్ని "వర్షించమని"
వెండివెన్నెలకి వేళవుతుందని రవికిరణం రాళ్ళమాటుగా వెళ్ళిందట
అలసిన రెక్కలు విశ్రాంతి కావాలని
    గూడువైపు వెళ్ళమని గుండెలో గుసగుసలు పలుకుతున్నాయి
వసంతానికి యవ్వనం వచ్చిందేమో,
    ప్రకృతి విరబూసి చెబుతూంది
పుడమి ప్రేమించిందేమో, ఉద్యావనం
    ఊహల్లో పందిళ్ళు వేస్తూంది
హరివిల్లె అలరించమని జీవిత సత్యాన్ని చెప్పకనే చెబుతూంది
అజ్ఞానం ఎడారి అనీ-అది నిర్జీవమని,
జ్ఞానం ఒక మైదానమనీ-అది అలరిస్తుందని
    ఇది లయకారుడి సృష్టి చిత్రం
    అనుభవించాల్సిందేగా ప్రతినిత్యం

సరస్వతీ నగర్, గోపాల్‌పూర్ రోడ్, హన్మకొండ, జి॥ వరంగల్లు.

# ఆలోచన

- పల్లె నాగేశ్వర్ రావు

(ఏమీ సాధించలేదు, ఏమీ చేయడం లేదు, ఏమీ చేయలేను అనే నిర్లిప్తతగల మనిషి, అజ్ఞానమనే అంధకారం నుండి - విజ్ఞానమనే వెలుగు వైపుకు ఒక్క క్షణం ...... ఆ మనిషి ఆలోచిస్తే .........)

చిన్న సెలయేరులా పుట్టే ఆలోచనా ప్రవాహం
శంఖారావం, ఢంకాధ్వానం చేస్తూ,
ఉప్పెనయై, మహాసముద్రమై ముందుకు సాగుతూ ......
కొండలని పిండిచేయగల మహోన్నతమయిన
ఆత్మవిశ్వాసమనే శక్తిగా రూపుదాల్చి,
స్వస్తి వాక్యములు సంధానిస్తూ,
స్వర్ణ వాద్యములు సంరావిస్తూ ......
నిర్లిప్తత, నిరాసక్తలను ఉత్తేజంతో
హృదయ దౌర్బల్యాన్ని తరిమి తరిమికొట్టింది
ఇప్పుడు మనస్సు ఎంతో ఆహ్లాదకరంగా ఉంది
అంబరాన్నంటుతున్న ఆత్మవిశ్వాసపు ఆసరాతో
నవశకానికి హృదయపూర్వక స్వాగతం పలికి
శ్రమాశ్వములపై, గిరులు సాగరులు లఘిస్తూ
సుశిక్షితుడైన ఒక సైనికుడిలా
తన శక్తి, సామర్థ్యాలను నిరూపించుకునేందుకు
విజయరంగం కోసం ఈ ..... ఆలోచన

3-3-79, యమునమణి చిట్‌ఫండ్ కం., టైలర్స్ స్ట్రీట్, హన్మకొండ, వరంగల్లు - 506 001

# ఆపదలో ఆడపిల్ల

- డా॥ కె.ఎల్.వి. ప్రసాద్

ఆడపిల్ల పుట్టిందని అలిగి కూర్చున్నాడు-సుబ్బారావ్
చలి-జ్వరంతో చతికిలపడ్డాడు-సుబ్బారావ్
మానసిక శోధనలు-మూగరోదనలు
ఆగని ఆలోనలతో అలసి సొమ్మసిల్లింది-సుశీల
అమాయకంగా చూస్తున్నది
అప్పడే బయటిగాలి పీల్చుకున్న ఆ ...... ఆడ పసిగుడ్డు
అయ్యో !! అని మూలిగింది అంతుబట్టని ప్రశ్నలతో
ఆవేదనలో నీ మనస్సు
నవమాసాలు మోసి, జన్మనిచ్చిన తల్లి ఆడపిల్ల కాదా !
రేపటి ప్రపంచానికి జనాభా నిర్మాతలయి
పునాది వేసే మహిళ
ఆడపిల్ల కాదా ?
ఆఖరి క్షణాల్లో ఆత్మీయంగా ఆదుకునే
తల్లి-చెల్లి-భార్య-కూతురు ఆడపిల్లలు కాదా !
మరెందుకు ఈ ఆలోచన !
మరెందుకు ఈ ఆవేదన !!
అందుకే నేనంటాను ---
ఆడపిల్ల పుట్టిందని కుమిలి పోవద్దు
మగపిల్లాడి కోసం ఎదురుచూడొద్దు

రామకృష్ణా కాలనీ, సహృదయ మార్గ్, ఆర్.ఇ.సి. పోస్టు, హన్మకొండ - 506 004

# కళ్ళు కల్లలు మాట్లాడ్తాయి

- మొహమ్మద్ నవాజ్ అలీ

అద్దం అబద్ధాలను చెప్పతున్నట్లే
కళ్ళు కల్లలు మాట్లాడ్తాయి
కడలి తీరాలకన్న కడుదూరానయున్న
భూమ్యాకాశాలు సమాశ్లేషించుకొంటున్నట్లు ..........
ఎండమావిలో కుండల కొద్ది నీరుందని
దాహార్తికి భ్రాంతి కలిగించి
దారీతెన్నూ లేని ఎడారిలో
దౌడు తీయించి ప్రాణాలు తోడేస్తూ ......
దనుజమాయ తప్ప అన్యము కాదని - రా
మానుజుడెంతగా చెవిలో యిల్లుకట్టుక పోరినా
పెడచెవిని పెట్టి పైడి లేడి కోసం
దాశరథిని అడవిలో దౌడు తీయించి ..........
స్వకార్యం, స్వామి కార్యం నెరవేర్చిన నేర్పరియట్లు
తన చుట్టు తాను తిరుగుతూ,
సూర్యుని చుట్టు తిరగడమేగాక
ఆస్టరాయిడ్‌తో దాగుడు మూతలాడు గడసరి పుడమిని
ఒద్దికగాయున్న బుద్ధిపూసయన్నట్లు ......
నిర్ణీత కక్ష్యలో స్వప్రదక్షిణ కావించే కర్మ సాక్షిని
ప్రాగ్దిశలో ప్రభవించి పశ్చిమానికి
మహాభినిష్క్రమణం కావిస్తున్నట్లు కళ్ళు కల్లలాడ్తాయి.

రిటైర్డ్ టీచర్, ఇ.నెం. 8-22, నేతాజీ వీధి, నర్సంపేట - 506 132 జి॥ వరంగల్లు

శ్రీలేఖ సాహితి ప్రచురణలలో

భాగస్వామ్యం అందించినవారు

శ్రీ టి. కా[illegible]

శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి

[illegible]

కీ॥శే॥ [illegible]

శ్రీ పల్లె సేను

శ్రీ యమ్. సుబ్బారావు

ఆచార్య కోవెల సంపత్కుమారా చార్యులు

శ్రీ ఆర్. రంగస్వామి గౌడ్

డా॥ టి. శ్రీరంగస్వామి

డా॥ ఆశావాది ప్రకాశరావు

... వ్యాస, కవితా సంకలనాలలోని

రచయితలు



# "VRUSHA" (Collection of Free Verse)

Poetry Edited by Dr. T. SRIRANGA SWAMY

SRILEKHA SAHITHI

WARANGAL

Price Rs. 30/- 2001

Sri Shanthi Offset Printers, Hanamkonda Ph. 579541